# శ్రీ ఉమామహేశ్వర వ్రతకల్పమ్ కథ

## ప్రథమోధ్యాయః

సూత ఉవాచ :

శ్లో॥ ఏకదా గౌతమోయోగీ పరానుగ్రహ విప్సయా॥
సంచరన్ సకలాన్లోకాన్మ్యలోకం సముపాగతః
తత్రత్యా మానవాస్సర్వే నానాక్లేశ సమన్వితాః
నానాయోని సముత్పన్నాః పచ్యంతే పాపకర్మఃభి॥
అపుత్రా నష్టపుత్రాశ్చ నిర్ధనా దుర్భగాసధా ।
యువత్యః పతిహీనాశ్చ బాల్యే విగతభర్తృకాః॥
స్త్రీహత్యాః కేచననరాః భర్తృ హత్యశ్చకా స్త్రియః॥
ఏతేషాం దుఃఖరాహిత్యం కేనోపాయేన వాభవేత్ ॥
ఇతి సంచిత్య మనసా శివలోకం గతస్తదా ॥

తా. సూతమహర్షి శౌనకాది మహర్షులతో ఇట్లు చెప్పుచున్నాడు. ఒకప్పుడు గౌతమ మహర్షి లోకానుగ్రహము కొరకు పర్యటన జేయుచు మనుష్యలోకమువచ్చి మానవులనందరిని జూడగా చౌరాశి లక్షయోనుల యందు బుట్టి కష్టపడి మానవజన్మకు వచ్చి ఏ సుఖమును జెందక నానాక్లేశ ములంబడుచున్నారు. పుత్రులులేనివారు కొందరు నష్టసంతతి గలవారు, ధనహీనులు, దౌర్భాగ్యులున్నూ, యౌవనమందు భర్తలేని స్త్రీలు కొందరు బాల వితంతులు, భార్యను హత్యచేయు నరులున్నూ, భర్తను జంపు స్త్రీలున్నూ, అనేక పాపకర్మలంజేసి క్షయ, కుష్ఠు మహావ్యాధులతో బాధనొందుచున్న స్త్రీ పురుషులంజూచి వీరల కష్టములెట్లు నివారణ యగునని యోచించి శివలోక మును గూర్చి వెళ్ళగా....

తత్రస్థం దేవదేవేశ ముమయా సహితం శివం ॥
కుందేందు ధవళాకారం నాగాభరణ భూషితం ।
వరదా భయహస్తంచ బిభ్రాణం పరశుం మృగం ।
కోటిసూర్య ప్రతీకాశం జగదానంద కారణం ।
జాహ్నవీ జలసంసిక్త దీర్ఘపింగ జటాధరం ॥
శీతాంశు విలసత్ఖండ కిరీటాంతర భూషణం ।
ఉజ్వల త్పాలనయనం తథా సూర్యేందు లోచనం ॥



నీలకంఠం చతుర్బాహుం గజేంద్రాజిన వాసనం
రత్నసింహాసనారూఢం నానాభరణ భూషితం ॥
దేవీంచ దివ్యావయవాం బాలసూర్యాయుత ద్యుతిం
బాలవేషాంచ తన్వంగీం బాలశీతాంశు శేఖరాం ॥
పాశాంశు శాభయవరాన్ బిభ్రతీంచ చతుర్భుజాం
ప్రసాదసుముఖీంబాలాం లీలారస విహారిణీం।
ఉమామహేశ్వరౌ దృష్ట్వా సమాధిమగమన్మునిః॥

తా. అచ్చట పార్వతీసమేతుడైన మహేశ్వరునిజూచివర్ణించు చున్నాడు. దేవతలకున్నూ దేవుడు గనుక మహాదేవుడు చంద్రునివలె మల్లి మొగ్గవలెనే తెల్లనియాకారము గలిగి సర్పహారములచే భూషితుండై దక్షహస్త ముల రెండి టితో పరశు, అభయములనున్నూ వామహస్తముల రెండింటితో వరద, మృగములనున్నూ ధరించి కోటిసూర్యుల కాంతి కలిగిన్నీ జగత్తున కానంద దాయకుడై ముక్తినిచ్చువాడై ఆకాశ గంగచే తడసి పింగళ వర్ణమైన పెద్దపెద్ద జటలు గల్గిన జటామకుటమందు చంద్రఖండముచే అలంకృతుడై పాలమందు తిలకాకృతిగా మూడవనేత్రము నగ్నిహోత్రునిగాను, సూర్య చంద్రులు రెండు నేత్రములుగాను, నల్లని కంఠముతోను, నాల్గు భుజములతో ప్రకాశించుచు వ్యాఘ్రచర్మమునుధరించి అనేకాభరణములచే నలంకృతుడై నవరత్న సింహాస నమందు మహేశ్వరుడు గూర్చొని యుండెను. ఉమాదేవియు వామాంక మందు గూర్చొని యుండెను. ఆమె త్రిలోకసుందరి, పదివేల బాల సూర్యుల కాంతిగల్గి చిన్నపిల్లవలె సన్ననిశరీరము గలిగి బాలచంద్రుని శిరో భూషణ ముగ ధరించి చతుర్భుజములతో పాశమును, అంకుశమును, వరదాభయము లను ధరించి నగుమోగంబుతో ఆనంద లీలలయందాడు చుండెను. ఇట్టి ఉమామహేశ్వరులంజూచి హృదయపద్మమందావాహన స్థాననంబులంజేసి జ్ఞానపూజలో సమాధ్యవస్థనొంది నిశ్చలుండయ్యెను.

ఈశ్వర ఉవాచ :

కిమర్థయాసి కిమస్తిచిత్తే కింకారణం బ్రూహిఋషీశ్వరాద్యః
తద్బ్రూహి కథయామి భద్రం ప్రాప్స్యోషి సర్వం భవదుఃఖనాశం ॥

గౌతమః

మర్త్యలోకే జనాస్సర్వే పచ్యంతే పాపకర్మభిః॥

ఐహికా ముష్మికం సౌఖ్యం కేనోపాయేన లభ్యతే ॥
తదాచక్ష్వ మహదేవ భవాన్ భక్తార్తి భంజనః॥
ఈశ్వర :
ఉమామహేశ్వరం నామ వ్రతానా ముత్తమం వ్రతమ్ ॥
య ఃకరోతి నరోభక్త్యా భోగమోక్షా సభుంజతే ।
గౌతమ :
భగవన్ కేన విధినా కర్తవ్యం వ్రతముత్తమమ్ ॥
కః కాలః కింవిధానంచ కోదేవః కుత్రపూజనమ్
తత్సర్వం బ్రూహి భగవన్ జిజ్ఞాసా జాయతేమమ॥

తా. అంతట మహాదేవుడు సంతుష్టి నొంది యో ఋషివర్యా! నీవెందుల కొచ్చినాడవు! నీ సంకల్పమేమిటి ? కారణమంతయూ సవిస్తార ముగ నెఱింగించెదవేని సంసార దుఃఖములను పోగొట్టి శుభమును గలిగించు నుపాయమును జెప్పెదననగా గౌతముడు హేమహదేవా! మనుష్యలోక మందు జనులందరును తాముజేసిన పాపకర్మలచే దుఃఖముల ననుభవించు చున్నారు. ఇహలోకమందు సర్వసౌఖ్యములున్నూ, అంత్యమందు ముక్తియు యే యుపాయముచే గలుగునో అట్టియుపాయము ననుగ్రహింపుము. నీవు భక్తుల బాధలను తొలగించునట్టి వాడవని బిరుదు నొందినావు గదా ! యనగా నీశ్వరుండు ఓఋషివర్యా! వ్రతములలోకెల్ల నుత్తమ వ్రతము ఉమా మహేశ్వర వ్రతము. దానిని భక్తితో జేయువానికి భోగభాగ్యములు మోక్షములు రెండును సంభవించును. నిశ్చయమని చెప్పగా గౌతముడు హేభగవాన్! ఆ విధాన మెద్దియో యెప్పుడు చేయవలెనో యెట్లు చేయవలెనో దేవుడెవరు? యెక్కడ పూజింపవలెనో సవిస్తరముగా శెలవియ్యవలయునని వినవలెనను జిజ్ఞాస గలుగుచున్నదని ఈశ్వరున్ని ప్రార్ధించగా,

**ఈశ్వర: శ్లో॥** ఉమామహేశయోః పూజా ఆగమేషు ప్రకీర్తితాః
మాసే భాద్రపదే పూర్ణమస్యాంతు వ్రతమాచరేత్ ॥
కామ్యార్థీ సర్వమాసేషు పూర్వాభాద్రోడు సంయుతే ।
ఉత్తరాభాద్ర నక్షత్రే మోక్షార్థీ వ్రతమాచరేత్ ॥
సంకటే సమనుప్రాప్తే తద్విముక్త్యై యదా కదా
సద్యస్సుఖ మవాప్నోతి వ్రతస్యాస్య ప్రభావతః॥



పుత్రార్థీ లభతే పుత్రం ధనార్థీ లభతే ధనం ।
వంధ్యా పుత్రవతీ భూయాత్కన్యాపతి మవాప్నుయాత్॥
విద్యార్థీ లభతేవిద్యా జయార్థీ జయమాప్నుయాత్ ।
నిష్కమాత్ర సువర్ణేన ఉమామహేశ్వరాత్మికే ॥
ప్రతిమే కారయిత్వాథ తయోస్సంపూజయే చ్ఛివౌః
యస్మిన్కస్మిం దినేమర్త్యో భక్తిశ్రద్ధా సమన్వితః॥
సప్తవింశతి సంఖ్యాక శైవబ్రాహ్మణ దంపతీః
సమాహరాయ సపత్నీక స్సర్వోపస్కర సంయుతః॥
బంధుభిర్బ్రా హ్మణైస్సాకం సాయంకాలే యథావిధిః
వ్రతంకృత్వా కథాం శృత్వా రాత్రౌ జాగరణం చరేత్ ॥
ఋత్విగ్భిస్సహసోత్సాహం పయో మాత్రాశనేనవా॥
రాత్రౌ శివకథ శ్రావ్యాః శ్రోతవా యత్నతోమునే॥
కర్తవ్యా యత్నతోరాత్రౌ పూజాయామ చతుష్టయే॥
పరేద్యురుషసి స్నాత్వా మండపోద్వాసనంకురు॥
శైవాన్సపూజయేద్భస్మ బిల్వాది కైస్సుమైః
ఏకైకస్మై ప్రదాతవ్యం శివయోః ప్రతిమాద్వయం॥
కలశోపి ప్రదాతవ్యో తతోవస్త్ర ద్వయాన్వితః॥
ఆచార్యో యప్రదాతవ్యం సువర్ణశతమాదరాత్॥
తతోయత్నేన శైవేంద్రా భోజనీయాః కృతవ్రతైః॥
సువాసిన్యోపి శైవానాం భోజనీయాః ప్రయత్నతః॥
భుంజీతత దనుజ్ఞాత సహేష్ట జనబంధుభిః॥
ఏవం యఃకురుతే భక్త్యా వ్రతం త్రైలోక్య విశృతం॥
భుక్త్వా భోగాన్ సువిపులాన్ శివమేవ ప్రపద్యతే॥

ఇతి ప్రథమోధ్యాయః

తా. ఈశ్వరుండిట్లు జెప్పుచున్నాడు. ఓగౌతమా! ఉమామహేశ్వర వ్రతము ఆగమముల యందున్నది. భాద్రపద శుక్లపూర్ణిమ రోజున సర్వులు చేయవలయును. కామ్యార్థులు ప్రతిమాసమందు పూర్వాభాద్రా నక్షత్ర దిన మందును మోక్షార్ధులు ఉత్తరాభాద్రా దినమందును ఆచరించవలయును. ఈ వ్రతమందు భోగమోక్షములు రెండును గలవు. కష్టములు ప్రాప్తించినపుడు

నివృత్తి కొరకెప్పుడైనను సరే యాచరించిన త్వరలోనే వ్రత ప్రభావముచే సుఖ ప్రాప్తి కలుగును. పుత్రార్థియై వ్రతము నాచరిస్తే సంవత్సరమునకు పుత్రప్రాప్తి కలుగును. ధనార్థికి ధనప్రాప్తి కలుగును. కన్యకు పతిలాభమున్నూ, వంధ్యకు పుత్రలాభమున్నూ, విద్యార్థికి విద్యాలాభమున్నూ జయార్థికి జయ లాభమున్నూ, వ్రతప్రభావముచే గలుగుచున్నవి. వరాయెత్తు వరాయెత్తు బంగారముచే పార్వతీప్రతిమను, మహేశ్వర ప్రతిమనున్నూ జేయించి సిద్ధ పరచుకొని ప్రతిదినమందు ప్రతిమలయందునూ మహేశ్వరులను భక్తిశ్రద్ధ లతో పూజించవలయును. పూర్వదినమందే సాధనాసామగ్రినంతను సంపా దించి ఇరువది ఏడుగురు శైవబ్రాహ్మణ దంపతుల నాహ్వానించి బంధువులను, బ్రాహ్మణులను సమావేశపరచి మరునాడు సాయంకాలమందు దారాపుత్రాదు లతో సాంగోపాంగముగా వ్రతమునాచరించి భోజనము చేయక పాలుత్రాగి రాత్రియందు జాగరణం చేయుచు శివకథలను వినుచు యామ చతుష్టయమం దును షోడశోపచార పూజచేసి మరునాడు ప్రాతస్స్నాన మొనరించి పునః పూజ పూర్వోక్తముగా మండపోద్వాసన గావించి శైవ బ్రాహ్మణ పండితులను భస్మబిల్వ మాలాదులచే నర్చించి ఒక్కొక్క ప్రతిమను దానంచేసి కలశదానము మరియొకరికిన్నీ వస్త్రద్వయములో చీరను స్త్రీలకును, ధోవతిని పురులకున్నూ సమర్పించి యాచార్యునకు నూరుసువర్ణముల నియ్యవలయును. తదనంతరం శైవపండితులను దంపతీయుక్తముగా కూర్చుండబెట్టి షడ్రసోపేతముగా నానావిధ భక్ష్యములతో భోజనంబిడి దక్షిణ తాంబూలాదులనిచ్చి, వారి యాజ్ఞంజేకొని బంధుమిత్రాదులతో తాను మౌనముగా భుజించవలయును. ఇట్లు త్రిలోక ప్రసిద్ధమైన యుమామహేశ్వర వ్రతము నాచరించినవానికి ఇహమందు సమస్త భోగములున్నూ, అంతమందు శివసాయుజ్యమున్నూ లభించును.

ఇతి స్కాందే శివపరమాత్మ ఖండే ఉమామహేశ్వర
వ్రతమహిమా నామ ప్రథమోధ్యాయంసమాప్తిః



## ద్వితీయో౽ ధ్యాయ ప్రారంభః

సూత ఉవాచ

**కదాచిన్నై మిశారణ్యే । సూతం పౌరాణికర్షభం ।**
**శౌనకద్యామునిగణాః । ప్రపచ్చు రిదమాదరాత్ ॥**
**సర్వసిద్ధి కరంలోకే । ప్రసిద్ధే శ్శీర్ణ ముత్తమం**
**లోకకల్యాణదంబ్రూహి వ్రతంనో ద్విజసత్తమ॥**

తా. శౌనకాది మహర్షులు, సూతులవారింగని సర్వసిద్ధి ప్రదంబయి నది. కల్యాణకారకంబయినది అగునీ వ్రతంబు, మున్నెవ్వరాచరించినది ఆ కథా వివరంబు మాకు సవిస్తరమ్ముగ విన్నవింపుమని వేడగా.

**ఆ సీ పురావణక్ష్రేష్ఠో । వీరసేన ఇతిశ్రుతః॥**
**నర్మదా తీరనికటే । మకరే పట్టణ స్థితః॥**
**సమగ్రైశ్వర్య సంపన్నో ప్యన పత్య తయా చిదాత్ ।**
**ప్రపేదే సపరాంచింతాం । స్వదార స్సర్వదైవహి ॥**

తా. తొల్లి నర్మదానదీతీర ప్రాంతమ్మున మకర మనే పేరు గల పట్టణమ్మున వీరసేనుండను వర్తకుండుకలడు. అతండు ఐశ్వర్యవంతుండు కాని సంతానహీనుండు. అందుకై ఆదంపతులు మిక్కిలిగా చింతించుచుండిరి.

**జాతు చిద్భక్త రక్షార్థం । ఆగతం స్వ గురుం వరం ।**
**ఆత్రేయం మునిశార్దూల । మభ్యుత్థాయ సమాదరాత్ ॥**
**ఆనర్చతు రుభావర్ఘ్య పాద్యాచమన పూర్వయా**
**సపర్యయాథభుక్తంతం । సువిశ్రాంత ముపేత్యవై ॥**

తా. ఒక దినమ్మున భక్త సంరక్షణార్థమై, మునిశ్రేష్ఠుండగు ఆత్రే యుండు, అచ్చటికి రాగా, ఆ దంపతులెదురేగి, అర్ఘ్య పాద్యాదులచే అర్చించి, కుడువంబెట్టి, విశ్రమించియున్న సమయమ్మున అతని చెంతకేగి.

**శివానుగ్రహతః పూర్ణా । సంపదస్సర్వ ఏవహి ।**
**అనత్యా భావజాచింతా । కింతు సంతాప కారిణే ॥**

తా. మహనుభావా ! శివానుగ్రహముచే మాకు సంపదకేమియు కొరతలేదు. కాని సంతానహీనులమైతిమి. అపుత్రస్య గతిర్నాస్తి అని పెద్దలు చెప్పుదురు కదా ! దీని కుపాయమేమి ? అని ప్రశ్నింప ఋషి తిలకుండిట్లు వచింపం దొడంగె.

**ఉమామహేశ్వరం నామ సర్వసంపత్ప్రదంపదం**
**తత్కృత్యా సంతతింభాగ్య మైశ్వర్యం చాప్నుతం యువాం ॥**

తా. సంతాన సౌభాగ్యములొసంగునది, పార్వతీ పరమేశ్వరుల కత్యంత ప్రీతిదాయకమైనది, ఉమామహేశ్వరవ్రతంబు కలదు. దాని నాచరింపుడు.

**పురాబ్రహ్మోదయో దేవా వ్రతస్యాస్య విధానతః**
**లేభిరే కీర్తిమతులా మితిప్రోవా చతుర్విధం ॥**
**తతస్తేదం పతీశ్రద్ధా భక్తి యుక్తౌ యధావిధి ।**
**చక్రంతే తద్వ్రంతేన వుమపత్యమజాయతే ।**
**తతస్తనయ వాత్సల్య లీలాలాస మానసే ।**
**విసస్మరతురబ్దే బ్దే వ్రతచర్యాం, సుతోపినః॥**

తా. పూర్వమీవ్రతంబు బ్రహ్మాది దేవతాలచరించి ప్రఖ్యాతి వడసిరి అని వ్రతవిధానంబుపదేశించె. అంత నా దంపతులు భక్తిశ్రద్ధలతో వ్రతంబు చేయుచుండిరి. కొంత కాలమ్మున వారికి ఒక మగ శిశువు జన్మించె, ఆ సంతోషాతిశయమ్మున వ్రతము మాట మరచిరి.

**దినేదినేభివృద్ధో భూద్బాల చంద్రోయధాభృశం**
**తతష్షోడశ వర్షే గుప్త రాజ్యాభి జాత్యకాం ॥**
**వీర్యవద్వణిగాఢ్యస్య తనయాం దారకర్మణి ।**
**భుఞ్జానో వివిధాన్భోగా స్సుఖం కాలం నినాయహి ॥**

తా. పిల్లవాడు క్రమక్రమముగ పెరిగి పదునారవత్సరమ్ముల వాడాయ్యెను. కొంతకాలమ్మునకు జీలంనదీతీరమున వీర్యవంతుడను ప్రసిద్ధికెక్కిన వైశ్యుని కూతునిచ్చి వివాహము గావించిరి. ఇట్లు కొడుకు కోడలు, భార్య తాను సుఖంబుండిరి.

**చోరాస్మిభ్యాం సమాక్రాంతం తతోస్యవణిజోగృహం ।**
**అలాభాద్భోక్తు మన్నస్య స్థాతుంగేహస్య చాధికం ॥**
**నిషణ్ణ స్సంభ్రమన్నంతే కస్య చిద్భాది వౌకసః॥**
**ప్రాంగణేన నివసదైవ । వశిష్ఠాశ్రమ మభ్యగాత్ ॥**
**తత్రతం ప్రణిపత్యాధ వ్యజి జ్ఞ పదధోగతిం ।**
**స్వకీయాం నోపిసంచిత్య ప్రాహోదం హోవిశాం వరః॥**





**శివప్రీతికరం పుణ్యం । ఉమామహేశ్వర వ్రతం**
**సంగృహ్యాత్యక్త వాం స్త్వంహ తతో భ్రష్ఠ స్సబాంధవః॥**

తా. కొంతకాలమ్మునకు ఆ వర్తకుని యింట దొంగలుపడి దోచుకొని పోయిరి. మరి కొన్నినాళ్ళకు ఆ ఇల్లు అగ్నికి ఆహుతియయ్యెను. ఇట్లు దీనావస్థలో చిక్కుకొని, ఎట్లో కాలక్షేపము చేయుచు తుదకు వశిష్ఠా శ్రమంబునకేగి ఋషీంద్రుని దర్శించి తన గోడు విన్నవింప నతండు దివ్యదృష్టిం జూచి, ఓయీ నీవు ఉమామహేశ్వర వ్రతంబాచరించ ఉల్లంఘించితివి. దానివల్లే నీకీ అధోగతి సంప్రాప్తమైనది.

**శృణుశాస్త్రం శివంవక్ష్యే మహర్షి ప్రవరోదితం ।**
**గురుత్యాగీ భవేద్రోగీ । మంత్రత్యాగీ పతేన్నరః॥**
**గురుమంత్రో భయత్యాగీ శౌరవంనరకం వ్రజేత్ ।**
**ఇతీరిత శ్శివే స్యాగః క్షంతుం । సంప్రార్థ్య భక్తితః॥**
**ఆశ్రమే తనయై స్తస్య క్రియమాణం వ్రతం శివం ।**
**దృష్ట్వా శృత్వా కథాం । తీర్ధ ప్రసాదౌ పరిభుజ్యచ ।**
**యధాపురస్య విభవే । కరిష్యమి వ్రతం పునః॥**
**ఇతి సంకల్ప్య పయయౌ గృహాభిముఖ మాశ్రమాత్ ॥**

తా. ఇంక వినుము. గురువును వదలిన నరుండు రోగగ్రస్తుడగును. గురువులుపదేశించిన వ్రతాదులు వదలిన పతితుండగును. ఈ రెంటినీ వదలినవాడు మహానరకమనుభవించును అని చెప్పిన తోడనే పార్వతీ పరమేశ్వరుంలగూర్చి క్షమాపణ వేడికొని, వశిష్ఠ పుత్రులాచరించు వ్రతమును చూచి తీర్థప్రసాదమ్ములు గ్రహియించి, పూర్వవైభవమ్ము మాకు కల్గినచో వ్రతంబు చేసెదమని సంకల్పించి తిరిగి గృహోన్ముఖుండయ్యె.

**అధమర్ణో ధనీకశ్చిత్పురా స్యా భ్యా గత స్స్వకం ।**
**గృహం ప్రావేశ యత్స్వస్య । ఋణోత్తారణ కాంక్షయా ॥**
**తతస్యస్థస్య సుదతీ వ్రతచర్యాం న్యజిజ్ఞపత్ ।**
**వాణిజ్యార్థేపరం సత్యం । కరిష్యామి యయౌత్వరం ॥**
**సౌరాష్ట్రం తత్ర లబ్ధ్వాధ భూరిద్రవ్యం పునఃపురం ।**
**సమాయయావధసతీ । స్మాదయామాససద్వ్రతం ॥**

**పుత్రిణం తనయందృష్ట్వా సర్వచింతావివర్జితం ।**
**కరిష్య ఇత్యేవమేవ కాలంక్షిప్త్వా యధావిధిః॥**

తా. ఇంటికి ప్రవేశించిన కొలది కాలమునకు బాకీలు వసూలగుటయు, వ్యాపారములో ప్రవేశించి, సౌరాష్ట్రదేశమునకేగి మిక్కిలిగ ధనము నార్జించుటయు జరిగెను. భార్యవ్రతము విషయం జ్ఞాపకము చేయగా కుమారునకు సంతతి కలుగగానే వైభవముగా చేయుదుమని సమాధాన మిచ్చెను.

**ససుతో నావమారుహ్య । సింహళనగమత్తతః।**
**ఝుం ఝువాతాహతానేకా మగ్నాంభోదేపరస్పరం ।**
**నిక్షిప్తే చపితాపుత్రౌ దైవాతీరగతః వితా ।**
**సుతప్రవృత్తి మజ్ఞాత్వా । చింతయాస్యగృహం యయౌ**
**దంపతీ స్నుషయాపాకం । శోకవా ర్ధామమ జ్ఞతుః॥**

తా. వీరసేనుండు కుమారునితో వ్యాపారము కొరకు సింహళద్వీపమునకేగుచుండ సముద్ర మధ్యంబున గాలివానచే పడవమునుగగా, తానొక ఒడ్డునకు చేరి కుమారుని జాడ తెలియక చింతించుచు ఇంటికివచ్చి భార్యా కోడలితో ఈ వర్తమానము చెప్పగా వారును మిక్కిలి శోకించిరి.

**అధినావ్యాధి రుత్పన్న స్తేనాసావ కృశ ద్భృశం ।**
**సిష్టాసయామఖాయాంతు రేవాకూలం గతాస్నుషా ॥**
**పుష్పావతీ సమద్రాక్షి త్క్రియమాణం వ్రతం పరైః।**
**ఉద్యనమ్మగ్న యానావా నిమగ్నే నాత్మ జన్మనా ॥**
**క్లుప్త వైధవ్య దుఃఖేన స్ను క్షే త్యేతచ్ఛు బాధికం ।**
**దూరై రనుష్టితం జ్ఞాత్వా ప్రసాదం పరిగృహ్యాచ ॥**
**స్వభర్తురాగమే తద్వ త్కరిష్యే హంవ్రతం త్వితి ।**
**సంకల్ప్య యాంతి స్వగృహం మధ్యేమార్గం దదర్శసా ॥**

తా. ఈ విచారమునకు తోడు శరీరమునకు వ్యాధిరాగా వర్తకుడు కృశియించు చుండె. ఒకనాడు కోడలు పుష్పావతి రేవా నదీతీరమ్మున మఖ నక్షత్రమ్మున స్నానమునకు వెళ్ళగా అచ్చట స్త్రీలు కొందరు తమ భర్తలతో గూడి వ్రతమాచరించుచుండిరి. పుష్పావతి యది చూచి, ఈ వ్రతంబెయ్యది, ఎందులకు చేయున్నారని యడుగగా, మా కుమారుడు సముద్రమున మునిగి



పోవుటచే దుఃఖితులమై ఈ యుమామహేశ్వర వ్రతంబాచరించుచున్నాము అని చెప్పిరి. వెంటనే తీర్థ ప్రసాదంబులు గొని, నా భర్త వచ్చినచో నేనును ఈ వ్రతంబాచరింతునని సంకల్పముచేసి ఇంటికి వచ్చుచుండ, మార్గమధ్యమ్మున నొక్క శివలింగము కన్పించె.

**తతో బిల్వపత్రాద్యైశ్చ । పుష్పాదిపూజితోత్తతః।**
**భద్రే త్వచ్ఛ్వ శురోభ్రష్టో వ్రతాత్తజ్జావిపత్తవః॥**
**ఇతి ధ్వనింసమాకర్ణ్య । మంతు క్షంతుం శివస్తుతిం ।**
**కుర్వతీ వదనం ప్రాప్య । శ్వశ్రావృత్తం సమఖ్యత ॥**
**తతోగురుం సమానీయ బంధుమిత్రే స్సమన్వితాః।**
**ఉమామహేశ్వరం నామవ్రతం చక్రే యధవిధి ।**
**వాసరాభ్యంతరేపూర్వం మగ్నాంభోదేయదృచ్ఛ**
**యా తీర మాసాద్య నిచరణ్ కేరళా ధిసమానితః।**
**గృహంప్రత్యాగమద్భర్తా । తుష్టాసంపూజ్య దంపతీం ।**
**కష్టదారిద్ర్య శమనం ప్రతిపర్వణి సువ్రతం ॥**
**కుర్వతీత తత్ప్రభావేన భుక్త్వాభోగా నిహాధికాన్ ।**
**అంతేచ శివసాయుజ్యం సౌఖ్యమావనిరంతరం ॥**

తా. ఆ లింగమునకు, బిల్వపత్ర పుష్పాదులతో పూజింప, ఓవనితా! నీ మామ వ్రతభ్రష్టుడు. దానిచే నీకీ విపత్తు కల్గినది అను ధ్వని విని క్షమాపణ చెప్పుకొని, ఇంటికివచ్చి అత్తగారికీ వృత్తాంతంబు చెప్పి, గురువరేణ్యుండగు ఆత్రేయ మహర్షి చెంతకేగి వారిందోడ్తెచ్చి ఆరాధించి, యధాశక్తి ఉమామహేశ్వర వ్రతంబాచరించె. అటులొనరించిన వారము దినములకు తన భర్త సముద్రమున మునింగి, దైవ వశమ్మున నొక దరికిచేరి దేశదేశమ్ములందిరిగి, ఇంటికి రాగా పుష్పవతి మిక్కిలి సంతోషించి, ఈ వ్రత ప్రభవమ్మననే మన కష్టములన్నియు తొలగినవని, ప్రతి పౌర్ణమి యందున, ఉమా మహేశ్వర వ్రతంబాచరించి చివరకు శివసాయుజ్యమును చెందిరి.

ఇతి ద్వితీయోధ్యాయసమాప్తాః

## తృతీయోధ్యాయ ప్రారంభః

**సూతమేదం వ్రతం చీర్ణం । పురాకేన వదస్వమే ।**
**కస్యకామ మభూత్సిద్ధిః వ్రతస్సాస్య ప్రభావతః॥**

తా. సూత మునీంద్రా ! పూర్వమీ వ్రతంబింక ఎవ్వరాచరించిరి, ఈ వ్రత ప్రభావము వలన ఇంక ఎవరి మనోరథమ్ములు, సఫలమైనవో చెప్పమని వేడుకొనగా–

**పురాశైవ వరోరాజన్ దూర్వాసాఖ్యో మునీశ్వరః।**
**కదాచిత్ సంచారాన్ లోకాన్ దదర్శ కమలాపతిం ॥**
**తతస్సమాగతం దృష్ట్వా దూర్వాసో మునిసత్తమః।**
**బిల్వ మాలాందదౌతస్మై శంకరేణ ప్రసాదితామ్॥**
**గృహీత్వా బిల్వమాలాంతాం హరిర్గమన సంభ్రమాత్।**
**శిరసాపూజనీయాం తాం గరుడపరి నిక్షిపత్ ॥**
**తతస్తం తాదృశం దృష్ట్వా దూర్వాసాః క్రోధమూర్ఛితః।**
**హరిం శశాప బహుధా దిగ్జన్మేతిచ సంపదన్ ॥**
**మయాశివార్పితా దత్త । మాలాతుభ్య మయాపహ ।**
**సాకథం గరుడస్కంధే వినిక్షిప్త్వా త్వయాహరే ।**
**సర్వస్వమూలా భూతేయం లక్ష్మీస్తవ వినశ్యత్॥**
**లక్ష్మీః పతతు దుర్ధాబ్ధౌ గరుడోపి వినశ్యత్ ।**
**వైకుంఠ స్వాదికారోపి తవయాతు మదాజ్ఞయాః॥**
**నిస్తేజస్కో వనప్రాంతే సంచరాద్యావధి ధృవం ।**
**ఇత్యుక్త్వాసతు దూర్వాసా యయౌ లోకాంతరం ప్రతి॥**

తా. సూతమహర్షి శౌనకాది మహర్షులకు విష్ణ్వాదులు ఉమా మహేశ్వర వ్రతము నాచరించిన కథను జెప్పుచున్నాడు.

పూర్వకాలమందు శివావతార దూర్వాసు లొకప్పుడు సర్వలోకములను సంచరించుచు వైకుంఠమునకు వెళ్ళి విష్ణుమూర్తిని చూచెను. ఆ విష్ణువు దగ్గరకు వచ్చి నమస్కరించగా కైలాసమందు శంకరునిచే ప్రసాదించబడిన బిల్వమాలను దూర్వాసుడు విష్ణుమూర్తి కొసగగా గ్రహించి తాను ప్రయాణ సంరంభంలో నుండి తాను కండ్లకద్దుకొనక శిరసాధరించక గరుత్మంతుని మెడలో వేయగా శివదూర్వాసులు క్రోధావేశముతో ప్రసాద ధిక్కారము చేసి



నాడని యిట్లు శపించెను. ఓ హరీ! నీ జన్మ నిరర్ధకము. సర్వ పాపములను బోగొట్టు బిల్వమాలను నీవేల ధరించవు? నీగర్వమునకు నీ సంపదయే కారణము. నీ సంపత్తు నశించి పోవుగాక! లక్ష్మి పాలసముద్రములో బడుగాక! గరుడుండు ఆకాశమున కెగిరిపోవుగాక! వైకుంఠాధికారము తొలగిపోవుగాక! యీ రోజులగాయితు తేజోవిహీనుండవై అడవిలో చెట్టు పుట్టలు దిరిగి కష్టముల ననుభవింతువుగాక! యని శపించి దూర్వాసుడు వెలడిపోగా.

**తతోతి దుఃఖితో విష్ణుః ప్రలపన్ వనమాశ్రితః**
**ఉపవాస విపినే ఘోరే స్వకృతం కర్మ సంస్మరన్ ॥**
**శివలోకాత్సమాయాతి తన్మార్గేణైవ గౌతమః॥**
**తతోశ్రు పూర్ణ నయనః కృతాంజలిపుటో హరిః।**
**జగాద పూర్వ వృత్తాంతం స్వలక్ష్మి నాశకారణం॥**
**తతోతిక్లాంత చిత్తాయ విష్ణవే వ్రతముత్తమం ।**
**శివేన కథితం తస్మై గౌతమోహ్యుపదిష్టవాన్**

తా. అనంతరమందు విష్ణువునకు వైకుంఠాధిపత్యము పోయినది. లక్ష్మి పాలసముద్రమున జేరినది. గరుడుండెగిరి పోయెను. తాను భరింపరాని దుఃఖముతో అరణ్యవాసమును జేయుచు తన పొరపాటును స్మరించుకొనుచుండగా గౌతములవారు శివుని వలన ఉమామహేశ్వర వ్రతమును విని కైలాసము నుండి యీ అరణ్య మార్గమున రాగా శ్రీహరి ఎదురుగా వెళ్లి సాష్టాంగ నమస్కారమును చేసి సాంజలిబద్ధుడై కన్నీరు వలపుచూ స్వవృత్తాంతమును (శివదూర్వాస శాపము వలన వైకుంఠాధిపత్యమి తొలగిపోవుట లక్ష్మికి క్షీరాబ్ధి గమనము గరుడున కాకాశ గమనము తనకరణ్య వాసమును) జెప్పుకొని మహాత్మా! యీ దుఃఖము తొలుగుటకేదైనా నుపాయమును శెలవియ్యుడనగా గౌతముడు దయార్ద్ర హృదయుడై ఈశ్వరుండుపదేశించిన యుమా మహేశ్వర వ్రతమును విధి విధానములతో నుపదేశించగా.

**తతోఽ విలంబం విధివ చ్చకార శ్రద్ధయాన్వితః**
**తతః ప్రసన్నో భగవాన్ హరయే పార్వతీపతిః॥**
**దదౌ లక్ష్మీం సగరుడాం వైకుంఠం కరుణానిధిః**
**తతః కైలాస మగమ దుమయాసహ శంకరః॥**
**లక్ష్మి గరుడ సంయుక్తో హరి ర్వైకుంఠ పాలకః।**
**వ్రతచర్యా ప్రభావేన సర్వసంపద్వృతో హ్యభూత్ ॥**

తా. తరువాత విష్ణువు భక్తి శ్రద్ధలతో గూడి గౌతమ మునిని దగ్గర నుంచుకొని తక్షణమే ఉమామహేశ్వర వ్రతమును విధిప్రకారము చేయగా నావ్రతప్రభా వంచే ఈశ్వరుడు ప్రసన్నుడై యేమి కావలయునని యడుగగా నా విష్ణువు దూర్వాస శాపమును తీసివేయవలయునని కోరినందున వైకుంఠాధిపత్య మున్నూ లక్ష్మీ గరుడులను ప్రసాదించి పార్వతితో శివుండు కైలాసముం జేరుకొనగా విష్ణువున్నూ లక్ష్మీ గరుడులతో వైకుంఠమునకేగి వ్రతప్రభావము వలన సర్వసంపత్తులతో గూడిన వాడాయెను.

**ఋషయః: సూత సూత మహాప్రాజ్ఞ విష్ణుర్నారాయణోమహాన్ ॥**
**అన్యేషాంకా కథా దేవ పునఃకైః కైఃరనుష్ఠితం॥**
**తద్వదస్వ మహాభాగ తృష్టాస్మాకం ప్రవర్ధతేః**
**ఇదమేవ వ్రతం చీర్ణం ఇంద్రేణాపి హతౌజసా॥**
**తేనప్రాప్తస్త తస్స్వర్గ స్వర్గ భోగశ్చ శాశ్వతః**

తా. శౌనకాదులు సూత మహర్షినిట్లు ప్రశ్నవేసిరి. ఓయీ మహా ప్రాజ్ఞుడా! విష్ణుమూర్తి మహా నారాయణుడు గావున గోల్పోయిన వైకుంఠ పదమును తిరిగి సంపాదించు కొనగలిగెను. మాబోటివారు సంపాదించుటకు సాధ్యమా! మరెవ్వరైన అట్టి సిద్ధిని బొందిన వారున్నారా ! యని అడుగగా సూతుండిట్లు చెప్పుచున్నాడు. ఒకప్పుడు దేవేంద్రునకు స్వర్గపదముపోయి నహుషునకు సంక్రమించగా ఇంద్రుడున్నూ ఉమామహేశ్వర వ్రతమును జేయగా స్వర్గాదిపత్యము ప్రాప్తమై స్వర్గభోగము శాశ్వతంగా ప్రాప్తించినది.

**బ్రహ్మణాపి పురాచీర్ణ మిద మేవ వ్రతంయధా॥**
**నష్టా వాగీశ్వరీ తేన సంప్రాప్తా దుర్లభా పిసా ।**
**మునిభిశ్చ పురా చీర్ణం వ్రతమే తన్ముముక్షుభిః॥**
**అస్యవ్రతస్యా చరణాన్ముక్తిః ప్రాప్తా మునీశ్వరైః**
**ఇదం వ్రతం ప్రయత్నేన యఃకరిష్యతి భక్తితః॥**
**తస్యసౌభాగ్య సంపత్తి ర్భవిష్యత్యేవ సర్వధా ।**
**యస్యాస్త్యైశ్వర్య భోగేచ్ఛా మోక్షేచ్ఛా వ్యనపాయినీ ॥**
**యస్య సర్వాధి పత్యేచ్ఛా తేనకార్య మిదం వ్రతం ।**
**వైద్యుతే నాపి విప్రేణ మోక్షార్ధ మతి యత్నతః॥**



**కృతమేతద్వ్రతం పూర్వం సర్వభీష్ట ఫలప్రదం ।**
**ముక్తిః ప్రాప్తాచ తేనాపి వ్రతస్యాస్య ప్రభావతః॥**
**యం యం కామం సముద్దిశ్య వ్రతమే తదనుత్తమం ।**
**యః కరిష్యతి తంకామం నసమాప్నోతి నిర్మలం।**

తా. పూర్వమందు బ్రహ్మకు వాగీశ్వరియైన భార్యతో వియోగం కలిగి నపుడు ఉమామహేశ్వర వ్రతంచేయగా, దుర్లభమైన వాగీశ్వరి ప్రాప్తమయ్యెను. పూర్వమందు మునీశ్వరులు ముక్తికాములై యీ వ్రతము నాచరించగా వారికి ముక్తి లభించినది. ప్రయత్నముతో భక్తిపూర్వకముగా నీ వ్రతము నాచరించిన వారికి సౌభాగ్యము, సంపత్తు సర్వవిధములా గలుగును. భోగములయందు వాంఛగల వారిలో కొందరికి మేక్షేచ్ఛయు నిడువరానిదిగా నుండి సర్వాధి పత్యము గావలసిన వారలీవ్రతము నాచరించితే ఇహమందు రాజ్యాధిపత్యము సర్వభోగములు ప్రాప్తించి అంత్యమందు ముక్తి నొందుదురు. వైద్యుండను నొక బ్రాహ్మణుడు ముక్తి కొరకనేక ప్రయత్నములు చేసియు ప్రాప్తించక యీ వ్రతము నాచరించి జీవన్ముక్తుండయ్యెను. యే కోరికతో నాచరింతురో వారా కోరికను తప్పకుండా బొందుదురు.

**గౌతమాయ మహేశేన సమాఖ్యాత ముమాంప్రతి**
**కుమారాయ సమాఖ్యాత ముమయా తద్వ్రతం శుభం**
**నందికేశాయ కథిత దూర్వాస మునయేతతః**
**దూర్వాస పాపి కథిత మగస్త్యాయ వ్రతోత్తమం॥**
**వ్రతంచ సాగరె పంక్తి ముఖసంహరణాయ వైః**
**రామాయ క్లిన్న చిత్తాయ ప్రణీతం కుంభ జన్మనా॥**
**సూర్యోపి గతి రోధేన చంద్రోపి క్షయరోగతః**
**తాభ్యాల చీర్ణం వ్రతమిదం సర్వసౌభాగ్యదాయకం॥**
**కశ్యపాది మునిభ్యశ్చ కథితం వ్రతముత్తమం ।**
**భూతవ్రతాని సంత్యేవ బహూని వివిధానిచ ॥**
**యద్యాప్యేత ద్వ్రతాదవ్య ద్వ్రతం నాస్యైన్య సర్వదా**
**ఇదం వ్రతం శివక్షేత్రే యః కరిష్యతి భక్తితః॥**
**తస్య సర్వార్ధ సంపత్తి ర్భవత్యేవ నశంశయః॥**

ఇతి స్కాందే శివరహస్యఖండే ఉమామహేశ్వర వ్రతం నామతృతీయోధ్యాయః

తా. ఉమామహేశ్వర వ్రతమును మహేశ్వరుడు గౌతమమునికిని, వామాంకమందున్న ఉమాదేవికి చెప్పెను. ఉమాదేవి శుభప్రదమైన నీ వ్రతమును కుమారస్వామికి, కుమారస్వామి నందికేశ్వరునకు, నందికేశ్వరుడు దూర్వాసమహర్షికినీ, దూర్వాసులు అగస్త్యుల వారికిని, అగస్త్యు లవారు రావణ వధార్ధియై వారధి బంధన సమయమందు శ్రీరామచంద్ర మూర్తికిన్నీ ఉపదేశించి వ్రతము చేయించెను. సూర్యుడు వింధ్య పర్వతము అడ్డు తగిలినపుడును, చంద్రుడు క్షయరోగముపట్టినపుడును నీవ్రతము ఆచరించిరి. మరిన్నీ అగస్త్యులు కశ్యపాది మునులకున్నూ ముక్తి నిమిత్తమై యుపదేశించెను.

అనేక వ్రతములు అనేక ఫలములనిచ్చినవి ఉన్నప్పటికినీ నీ వ్రతముతో సరియైన వ్రతము మూడులోకములందు లేదని నిశ్చయము. ఈ వ్రతమును భక్తితో శివాలయమందు జేసినవారికి సర్వసంపదలు ముక్తిన్నీ గలుగును. సంశయములేదు. ఇట్లు స్కాందపురాణములో శివరహస్య ఖండమందలి ఉమామహేశ్వర వ్రతము తృతీయోధ్యాయము సమాప్తము.

## చతుర్థోధ్యాయః

శ్రీ సూతః

శ్లో॥ సర్వదుఃఖోపశమనం సర్వోపద్రవహారకం
ఉమామహేశ్వరం నామ వ్రతమస్తి సుఖావహం ॥
తస్యవ్రతస్సమాహాత్మ్యం । ఇతిహాసం పురాతనం
సర్వలోక ప్రసిద్ధంచ । వక్ష్యామి శ్రుణు పార్వతి ॥
అథాహం సంప్రవక్ష్యామి సర్వధర్మోత్త మోత్తమం।
ఉమా మహేశ్వర నామవ్రతం సర్వార్థ సిద్ధిదం ॥
ఆనర్తేష్వ భవత్క శ్చిన్నామ్నా వేదరథోద్విజః।
కళత్ర పుత్ర సంపన్నో విద్యానుత్తమ వంశజః॥
తస్త్యైవం వర్తమానస్య బ్రాహ్మణస్యగృహాశ్రమే
బభూవ శారదా నామ కన్యాకమల లోచనా॥
తాం రూపలక్షణోపేతాం బాలాం ద్వాదశ హాయనాం
యయాచే పద్మనాఖ్యో మృతదారోజరద్విజః
మహాధనస్య శూరస్య సదారాజ సఖస్యచ।
యచ్నాభంగ భయాత్తస్య తాం కన్యాం బ్రదదౌపితా॥



మధ్యందినే కృతోద్వాహస్స విప్రశ్శ్వశురాలయే ।
సంధ్యాముపాసితం సాయం సరిత్తట ముపాయయౌ॥
ఉపాస్య సంధ్యాం విధి వత్ప్రత్యాగచ్ఛం స్తమోవృతే।
మార్గేదష్టో భుజంగేన మమార నిజకర్మణా॥

తా. సూతమహర్షి శౌనకాది ఋషులతోనిట్లు చెప్పుచున్నారు. ఓ ఋషులారా ! నేను ఉమామహేశ్వర వ్రతము సర్వసిద్ధులను ఇచ్చుటచే సర్వ ధర్మములలోను ఉత్తమోత్తమని చెప్పుచున్నాను. ఆ వర్తదేశముల యందు వేదరథుడనే పేరుగల నొక బ్రాహ్మణుండుండెను. అతను ఉత్తమ సాంప్రదాయ కులమందు బుట్టి దారాపుత్రాదులతో సంపన్నుడై గృహస్థాశ్రమమును నెరవేర్చుచుండగా పద్మసమాన నేత్రములుగల శారదయును నొక కన్యక జన్మించి పెరుగుచుండెను. పన్నెండు సంవత్సరముల వయసు వచ్చిన బాల సర్వలక్షణములతో నొప్పియుండగా పద్మనాభుడనే మరియొక బ్రాహ్మణుండు భార్య చనిపోయినందున ద్వితీయ వివాహము కొరకు వేదరథునవద్దకేగి నీ కన్యను నాకు వివాహము చేయమని యడుగగా పద్మనాభుడు కోటీశ్వరుడును, శూరుడును రాజకళ గలవాడును గాన యాచ్నాభంగము జేయలేక తన కన్యను వివాహము జేసెను. మధ్యాహ్న కాలమందు వివాహమైంది. సాయంకాలమందు సంధ్యావందనం నిమిత్తం నదీతీరమునకు వెళ్ళి యథావిధిగా సంధ్యోపాసనజేసి వచ్చువేళకు చీకటిపడగా వచ్చు మార్గమందు పద్మనాభుడు సర్ప దష్టుడై కర్మవశముచే నత్తవారింటియందే మరణించెను.

తస్మిన్ మృతే కృతోద్వాహే సహసాగత్య బాంధవాః
చుక్రు శుశ్శోక సంతప్తా శ్వశురౌ సా చ కన్యకా॥
సంస్కృత్య తం బంధుజనా స్స్వం స్వంజగ్ముర్నికేతనం।
శారదాప్రాప్త వైధవ్యా పితురే వాలయేస్థితా॥
వృద్ధత్వా తనభీష్టేన భర్త్రా విరహితా సతీ
నినాయ కతిచిన్మాసాన్ సాబాలా పితృమందిరే॥
ఏకదా నైర్ధ్రవోనామ కశ్చిద్వృద్ధ తరోమునిః
అంధశ్శిష్య కరగ్రాహీ తన్మందిర ముపాయయౌ॥
తస్మిన్ వృద్ధేగృహం ప్రాప్తే గతేషు క్వాపి బంధుషు।
సాక్షా దివాత్మనో దైవం సాబాలా సముపాచరత్ ॥

**స్వాగతం తే మహాభాగ పీఠేస్మిన్నుప విశ్యతాం ।**
**నమస్తే మునినాథాయ ప్రియంతే కరవాణికం ॥**
**ఇత్యుక్త్వా భక్తిమాస్థాయ కృత్వాపాదావనే జనం ।**
**వీజయిత్వా ప్రధిశ్రాంతం తం మునిం పర్యతోషయత్ ॥**

తా. అప్పుడు బంధువులందురున్నూ అత్తమామలు కన్యకతో గూడా శోక సంతప్తులై రోదనముజేసిరి. బంధువులందరు దహనాది సంస్కారములం జేసి స్వగృహమునుగూర్చి వెడలిపోయిరి. శారదాకన్య వైధవ్యమనుభవించుచు పితృగృహమునందే యుండెను. భర్త ముసలివాడగుటచే తనకిష్టము లేకపోయి నను తండ్రి బలాత్కారముచే వివాహము జరిగెను. భర్తృ వియోగమైన తరువాత కొన్నిమాసములు గడచినవి. పిదప నొక దినమందు తల్లిదండ్రులు, మొదలగు బంధువులు గ్రామాంతరమునుగూర్చి వెళ్ళియుండగా జాత్యంధు డును అతి వృద్ధుడును అయిన నైధ్రువుండను మహర్షి శిష్యుని చేతియాసరాతో వేదరథుని ఇంటికిరాగా గృహయజమానులింట లేనందున శారదాకన్యయే స్వాగతమిచ్చి పాదములు గడిగి యాసనమున గూర్చుండబెట్టి తన దైవముగా భావించి, పూజించి, నమస్కరించి పాదసేవ జేసి విసనకర్రతో విసురుచు మార్గాయాసమునుబోగొట్టి మునినాథా ! భుజించెదరాయని అడిగి సంతోషపెట్టి.

**అంతః ప్రవేశ్య సాబాలా కృత్వాభ్యంగం స్వపాణినా**
**కృతస్నానంచ విధి వత్కృత దేవార్చనం మునిం॥**
**సుఖాసనోప విష్టంతం ధూపమాల్యాను లేపనైః**
**అర్చయిత్వా వరాన్నేన భోజయామాససాదరం ॥**
**భుక్త్వాతు సమ్యక్ఛకై స్తృప్తాశ్చానంద నిర్భరః।**
**చకారాథ మునిస్తస్యై సుప్రీతః పరమాశిషం॥**
**విహృత్య భర్త్రా సహ యా పదా యుర్లబ్ధ్వాసుతం సర్వగుణైర్వరిష్ఠం**
**కీర్తించలోకేను మహతీమ వాప్య ప్రసాదయోగ్యా భవదేవతానాం ॥**
**ఇత్యభివ్యాహృతం తేవ మునినాగత చక్షుషాః**
**నిశమ్య విస్మితా బాలా ప్రత్యువాచ కృతాంజలిః॥**
**శారదా: బ్రహ్మన్ త్వద్వచనం సత్యం కదా చిన్నమృషా భవేత్।**
**తదే తన్మంద భాగ్యాయాం కథంమయి భవిష్యతి॥**



**ఊషరస్యేవ నద్వృష్టి శ్శునక్యా ఇవ సత్క్రియాః**
**విఫలా మందభాగ్యా నా మాశీర్బ్రహ్మ విదామపి॥**
**స్తేషాహం విధవా బ్రహ్మన్ దుష్కర్మ ఫలభాగినీ।**
**తవాశీర్వచనస్యాస్య కథం యోగ్యాస్మి సంప్రతి॥**

తా. లోపలకు తీసికొనివెళ్ళి శారద స్వయముగా అభ్యంగనము జేయించి స్నానమాచరించి జ్ఞానపూజా ప్రకారము దేవార్చనయైన తర్వాత మునిని సుఖాసనమునం గూర్చుండబెట్టి గంధమాల్యాదులచే అలంకరించి ధూపదీపములనిచ్చి ఆదరముతో షడ్రసోపేతముగా భోజనంబిడిన తర్వాత ముని సావధానముతో తృప్తిగా భుజించి యానందభరితుడై యాశీర్వదించెను. "ఓ శారదా! నీవు యావజ్జీవము భర్తతో సుఖముననుభవించుచు, సకలగుణ సంపన్నుడైన కుమారునింగని లోకమందు గొప్పకీర్తిని సంపాదించి దేవతల వరప్రసాదమున కర్హురాలగుదువుగాక" అని ఆశీర్వదించినంతలో అంథుడైన మునిచే నొసంగబడిన యాశీస్సును విని యాశ్చర్యపడి యా బాల కృతాంజ లియై నిట్లు బలికెను. హే బ్రహ్మన్! తమ వాక్యమెన్నటికి యసత్యము గానేరదు. ఊసర క్షేత్రమందు వర్షము ఫలము నియ్యనియట్లును, శునకములకు సత్కర్మ అబ్బనట్లును భార్యహీనురాలైన నాయందెట్లు ఫలించును. నేను విధవను, బ్రహ్మవేత్తల యాశీర్వాదమైనను నిర్భాగ్యులకు పొసగదు. నేను పాపఫలము ననుభవించుచుంటిని. ఇప్పుడు మీ యాశీర్వచనమునకు నెట్లు యోగ్యురాల నగుదును?

**నైధృవం :**
**త్వామనాలక్ష్య యత్రోప్తే మంధేనాపి మయాధునా**
**తథేన సాధ యిష్యామీ కురునుచ్ఛాసనం శుభే॥**
**ఉమామహేశ్వరం నామవ్రతం యది కరిష్యసి**
**తేనవ్రతాను భావేన సర్వం శ్రేయానుభోక్ష్యసే**
**త్వయోపదిష్టం యత్నేన కరిష్యామ్యపి దుర్లభం**
**తద్వ్రతం బ్రూహిమే బ్రహ్మన్ విధానంచ సవిస్తరం**
**చైత్రేవా మార్గశీర్షేవా శుక్లపక్షే శుభేదినే**
**వ్రతారంభం ప్రకుర్వీత యదావద్గుర్వనుజ్ఞయా ॥**
**అష్టమ్యాంచ చతుర్దశ్యాం । ఉభయోరపిపర్వణోః**
**సంకల్పం విధివత్కృత్వా ప్రాతస్నానం సమాచరేత్ ॥**

తా. అప్పుడు శారద, మీరు చెప్పిన చొప్పున చేయుదుననగా, వ్రత విధానము చెప్పుచున్నాడు. చైత్ర, మార్గశిరమాసమందుగాని శుక్లపక్షము అష్టమి, చతుర్ధశి యందుగాని, శుభమాసమ్మున, శుక్లపక్షమ్మున యధాశక్తి గుర్వాజ్ఞంగొని వ్రతము చేయవలయును. ఆరోజు ఉదయం స్నానమాచరించ వలయును.

**అలోలలలితాపాంగీం భక్తానుగ్రహదయినీం**
**ఏవంధ్యాత్వాతుహృత్పీఠే జగతః పితరౌశివౌ ॥**
**జప్త్వా తదాత్మకం మంత్రం తదంతే బహిరర్చయేత్**
**ఆవాహ్యప్రతిమా యుగ్మే కల్పయేదాసనాదికం ॥**
**అర్ఘ్యం దత్వాచ శివయో ర్మంత్రేణానేనమంత్రవిత్ ।**
**నమస్తే పార్వతీకాంత నమస్తే భక్తవత్సల ॥**
**త్రయంబకమహాదేవ గృహాణర్ఘ్యం సదాశివ**
**నమస్తే దేవి విశ్వేశి ప్రసన్న భయహారిణీ ॥**
**అంబికే వరదేదేవి గృహాణార్ఘ్యం శివప్రియే**
**ఇతి ప్రివాసర ముచ్చార్య దద్యాదర్ఘ్యం సమాహితః॥**
**గంధపుష్పాక్షతాకల్ప ధూపదీపాన్ ప్రకల్పయేత్**
**నైవేద్యం పాయసాన్నం చ ఘృతాక్తం పరికల్పయేత్ ॥**
**జుహుయాన్మూలమంత్రేణ హవిషష్టోత్తరం శతం**
**తత ఉద్వాస్యనైవేద్య ధూపనీరాజనాదికం ॥**
**దద్యాన్నైవేద్య తాంబూలం నమస్కుర్యాత్ సమాహితః।**
**అధాభ్యర్ర్చ్యోపచారేణ భోజయేత్ విప్రదంపతీ ॥**
**ఏవం సాయంతనీంపూజం కృత్వా విప్రామమోదితః**
**భుంజీతవాగ్యతోభూత్వా హవిష్యం క్షీరభావితం ।**
**ఏవం సంవత్సరం కుర్యాద్వ్రతం పక్షద్వయేబుధః।**
**తతస్సంవత్సరే పూర్ణే వ్రతోద్యాపనమాచరేత్ ॥**
**శతరుద్రాభిజప్తైస్తు స్నాపయేత్ ప్రతిమాజలైః**
**ఆగమోక్త విధానేన పూజయేత్ గిరిజా శివౌ ॥**

తా. భక్తి భావమ్మున పార్వతీ పరమేశ్వరులను ప్రార్థించి, కల్పోక్త ప్రకారము మంటపమున గల ఉమామహేశ్వరులను పూజించవలయును. సాయం



కాలము వరకు ఉపవశించి, తిరిగి తోరపూజాదులంగావించి విప్రదంపతులకు, వాయనదానమిచ్చి ప్రతిమలను గూడ నొసంగి, భుజించవలయును. మరియొక పక్షము వస్త్రములను మాత్రమొసంగి, భోజనము పెట్టవలయును. ఇటుల పన్నెండు లేక పదహారు మాసములు వ్రతోద్యాపనములు గావించి, హోమ మొనర్చి, జాగరణములు చేసి దంపతులకు ప్రతిమలు, కలశములు, వస్త్రములు సమర్పించవలయును.

**భుంజీత తదనుజ్ఞాతస్సహేష్ట జనబంధుభిః**
**ఏవం యః కురుతే భక్త్యావ్రతం త్రైలోక్య విశ్రుతం ॥**
**త్రిసప్తకుల ముధృత్వ భుక్తా భోగాన్ యధేప్సితాన్**
**ఇంద్రాది లోకపాలానాం స్థానేషురమతే చిరం ।**
**బ్రహ్మలోకే చరమతే విష్ణులోకే చ శాశ్వతే ।**
**శివలోకం తతః ప్రాప్య తత్ర కల్పశతం పునః॥**
**భుక్త్వా భోగాన్ సువిపులాన్ శివమేవప్రపద్యతే ।**
**మహావ్రత మిదం వత్సే త్వమపిశ్రద్ధయాచర ।**
**అతీన దుర్లభంవాపి । లప్స్య సేచ మనోధరం**
**ఇత్యాదిష్టా మునీంద్రేణ సా బాలా ముదితాభృశం ।**
**ప్రత్యగృహీత్సు విస్రబ్ధా తద్వాక్యం సుమనోహరం**
**అధతస్సాస్సమాయతాః పితృమాతృ సహోదరాః॥**
**తం మునిం సుఖమాసీనం దదృశుః కృతభోజనం॥**
**సహసాగత్య తే సర్వే సమశ్చక్రుర్మహాత్మనే ।**
**ప్రసీదనః ప్రసీదేతి గృణంతః ప్రత్యపూజయన్॥**
**శ్రుత్వాచతేతయా సాధ్యా పూజితం పరమం మునిం ।**
**అనుగ్రహం కృతం తస్యై శృత్వా హర్షం పరంయయుః॥**
**తేకృతాంజల యస్సర్వే తమూచు ర్ముని పుంగవం।**

తా. నైధ్రువుండిట్లు జెప్పుచున్నాడు. "ఓ బాలా ! నేను అంధుడ నగుటచే నిన్ను గుర్తించక చేసిన యాశీర్వచనమును సాధించెదను. నీవు మాత్రం నేను చెప్పినట్లు నడుపుము. ఉమామహేశ్వర వ్రతమనునది యొకటికలదు. దాని నాచరించుటచే నీవు సుఖము నొందగలవు.

శారద :– హేబ్రహ్మన్ మీరుపదేశించిన దెంత దుర్లభమైనను చేయగలను, దానిని విధి విధానముతో నాచే చేయించ వలయునని వేడినంతలో నా

కన్య యొక్క తల్లిదండ్రులు సోదరులున్నూ గ్రామాంతరమునుండి వచ్చి భోజనం చేసి కూర్చున్న యా మునిని జూచి త్వరగా వచ్చి మహాత్మునకు సాష్టాంగ నమస్కారములుజేసి పూజించి వారి యనుగ్రహమునకు పాత్రులై యుండగా శారద మునియొక్క రాక మొదలు యాశీర్వచనాంతము వరకును సాధన ప్రయత్నమున్నూ చెప్పగా విని సంతోషించి దోసిలొగ్గి మునిని ప్రార్థించుచుండిరి.

**అద్యధన్యావయం సర్వే తవాగమన మాత్రతః॥**
**పాలితం నఃకులం సర్వం గృహంచ సఫలీ కృతం।**
**ఇయంతు శారదానామ కన్యా వైధవ్య మాగతా॥**
**కే నాపి కర్మభారేణ దుర్విలంఘ్యేన భూయసా ।**
**సైషాద్య తవపాదాబ్జం ప్రసన్నా శరణం సతీ॥**
**ఇమాం సముద్ధరా సంహ్యా త్సు ఘోరాదుఃఖ సాగరాత్।**
**త్వయాపి దావదత్రైవ స్థాతవ్యంనో గృహాంతికే॥**
**అస్మత్కృతేమఠేహ్యస్మిన్ స్నానపూజా జపోచితే।**
**ఏషా బాలాచ భగవన్ ప్రకుర్వంతీ త్వ దర్శనమ్॥**
**వ్రతం త్వత్సన్నిధానేవ చరిష్యతి మహామతే ।**
**యావత్సమాప్తి మాయాతి వ్రతమస్యాస్త్వదంతికే॥**
**ఉషిత్వా తాపదత్రైవ కృతార్థాం కురునో గురో ।**
**ఏవ మభ్యర్థి తస్సర్వై స్తస్యా భ్రాతృ జనాదిభిః॥**
**తధేతి స మునిశ్రేష్ఠ స్తత్రోవా చ మఠే శుభే ।**
**పాపితేనోపదిష్టేన మార్గేణ గిరిజాశివా॥**
**అర్చయంతీ వ్రతం సమ్యక్చకార విమలాశయా।**

ఇతి స్కాందపురాణే బ్రహ్మోత్తరఖండే ఉమామహేశ్వర వ్రతకథా నామ చతుర్థోధ్యాయః

తా. ఓ మునివర్యా! తాముదయచేయుట వలన మా గృహము సఫలమైనది మాకులమంతయు పవిత్రమైనది. ఈశారదా కన్య వైధవ్యము నొందినది. దాట శక్యముగాని గొప్పదియై ప్రారబ్ధమేదియో యెందువలననో యింత దుఃఖము ప్రాప్తించినది. ఈకన్యతమ పాదాబ్జమును శరణు జొచ్చినది. దీనిని అనంతమైన దుఃఖ సముద్రమునుండి లేవదీయండి. దుఃఖము తొలగేవరకు



తామును ఇక్కడ నివసించండి. తమ నిమిత్తమొక మఠమును నిర్మించెదము. అందులో స్నానము పూజ జపములకు ఏర్పాట్లు చేసెదము. ఓ భగవాన్ ఈ చిన్నది తమపాదపూజ చేయుచుండును. తమ సన్నిధానమందే వ్రతము నాచరించును. వ్రత సమాప్తి పర్యంతము తామిక్కడనే వసించి కన్యను కృతార్థురాలనుగా చెయ్యండి యని ఇంటి వారందరూ ప్రార్థించగా నా ముని శ్రేష్ఠుడు అలాగేయని మఠమందు నివసించి యుండెను. కన్యకయు గురూపదిష్ట మార్గముగా ఉమామహేశ్వరులను పూజించుచూ శుద్ధాంతఃకరణయై వ్రతము నాచరించుచుండెను.

ఇతి స్కాందే బ్రహ్మోత్తరఖండ మందలి ఉమామహేశ్వర వ్రతము అను చతుర్థాధ్యాయము సమాప్తము.

## అథ పంచమోధ్యాయః

సూత ఉవాచ :

**ఏవం మహావ్రతం తస్యా శ్చరంత్యా గురుసన్నిధౌ।**
**సంవత్సరో వ్యతీయాయ నియమాసక్త చేతసః॥**
**సంవత్సరాంతే సా బాలా తత్రైవ పితృమందిరే ।**
**చకారో ద్యాసనం సమ్యగ్విప్రభోజన పూర్వకం॥**
**దత్వాచ దక్షిణాం తేభ్యో బ్రాహ్మణేభ్యో యధావిధిః**
**విసృజ్యతా న్నమ స్కృత్వా పితృభ్యా మపివందిదా॥**
**ఉపోషితా వ్వయం తస్మిన్ దినే నియమ మాస్థితా ।**
**జజాప పరమం మంత్ర ముపదిష్టం మహాత్మనా॥**
**తతః ప్రదోష సమయే ప్రాప్తే సంపూజ్య శంకరం।**
**తస్మిన్ గృహాంతిక మఠే గురోస్తస్యచ సన్నిధౌ ॥**
**జపార్చనరతా సాధ్వీ ధ్యాయంతే పరమేశ్వరం।**
**చక్రే జాగరణం రాత్రౌ సూపవిష్టా శివాంతికే॥**
**తస్యాం రాత్ర్యాం తయా సార్థం సముని ర్జగదంబికాం।**
**జపధ్యాన స్త వై స్సమ్యక్తోషయా మాస పార్వతీం ॥**
**తస్యాశ్చ భక్త్యాచ వ్రతః ప్రభావాన్మునేస్తపో యోగసమాధినాచ।**
**తుష్టా భవానీ జగదేకమాతా ప్రాదుర్బ భూవామృత సాంద్రమూర్తిః॥**

**ప్రాదుర్భూతా యదా గౌరీ త్రయో రగ్రే జగన్మయీ ।**
**అంధోపి తత్క్షణా దేవ మునిః ప్రాప దృశోర్వయం॥**
**తాం వీక్ష్య జగతో ధాత్రీ మావిర్భూతాం పురః స్థితాం ।**
**నిపేతతుస్త త్పదయో స్సముని స్సాచకన్యయా ॥**

తా. ఈ ప్రకారము ముని నియమముతో గురు సన్నిధానమందు మహా వ్రతము ఒక సంవత్సరం జరిపి ఆ మఠమందే వ్రతోద్యాపన నిమిత్తమై బ్రాహ్మణ భోజనము దక్షిణ దానమునున్నూ చేసి బ్రాహ్మణులకు నమస్కారమునుచేసి పంపించి తల్లితండ్రుల యాశీర్వచనమున్నూ బడసి ఆ దినమందు నియమముతో నుపవాసముండి మహాత్ముడుపదేశించిన మంత్రమును జపించి ప్రదోషకాలమందు ఈశ్వరాధనచేసి గురు మఠమందు గురుచరణ సన్నిధియందు శివధ్యానముతో రాత్రియందు జాగరణమును చేయుటకు ఉపవిష్టురాలై యుండెను. ఆ రాత్రియందే మునియు జగదంబికను గూర్చి జపధ్యాన స్తోత్ర ములను శారదా కన్యతో కూడచేసి పార్వతిని సంతుష్టి నొందించగా నా జగదాంబ మునియొక్క సమాధి యోగములకును, శారదయొక్క భక్తి ప్రపత్తులకును సంతసించి సాక్షాత్కరించగా అంధుడైనమునికి నేత్రములు ప్రకాశించెను. అప్పుడు జగదంబ పాదములమీద కన్యామునులిద్దరునూ సాష్టాంగ నమస్కార ములతో బడియుండగా –
తౌభక్తి భావోచ్ఛ్వ సితామలావోశయా వానంద బాష్పో క్షితసర్వగాత్రౌ
ఉద్ధాప్య దేవీ కృపయా పరిప్లుతా ప్రేమ్ణా బభాషే మృదువల్లభాషిణీ॥

దేవీ: **ప్రీతాస్మితే మునిశ్రేష్ఠ వత్సే తుష్టాస్మితే సఖే ।**
**కింవా దదామ్యభిమతం దేవానామపి దుర్లభం ॥**

నైధృవ: **ఏషాతు శారదానామ కన్యకా గతభర్తృకా।**
**మయా ప్రతిశృతం నాస్యై తుష్యే న గతచక్షుషా॥**
**సహ భర్త్రాచిరంకాలం ఏహృత్య సుతముత్తమం।**
**లభస్వేతి మయాప్రోక్తం సత్యం కురు నమోస్తుతే॥**

తా. అఖండభక్తిచే నూర్ధ్వ శ్వాసవలన శుద్ధాంతరంగులై యున్నప్పటికినీ ఆనంద బాష్పములచే శరీరమంతయు తడిసిన కన్యా, మునుల నిద్దరినీ లేవదీసి ఆజగజ్జననీ కృపతోగూడి ప్రేమతో మృదు మధురముగా నిట్లు బలుకు



చున్నది. ఓమునివర్యా! సంతసించితిని. ఓసఖీ! ఆనందించితిని. దేవతలకును దుర్లభమైన వరమునిత్తును. యేమి కావలెనో కోరుకొనుడు అనెను. నైధృవుడు ఓతల్లీ! ఈశారదా కన్య వితంతువు. నేనంధుడనైనందున సంతోష పూర్వకముగా నీమెకు చిరకాలము భర్తతో క్రీడిస్తూ ఉత్తమ సంతానమును బడయుదువుగాక! యని యాశీర్వ దించితిని. నా యాశీర్వచన మును సత్యమైనదిగా జేయు దువని  నమస్కరించు చున్నాను.

**సూతః–ఇతి సంప్రార్థితా దేవీ జగాద పరయాముదా ।**
**దేవ్యువాచ: దేవీ ! ఏషా పూర్వభవే బాలా ద్రావిడస్య ద్విజన్మనః॥**
**ఆసీద్వితీయ దయితా భామినీ నామ విశ్రుతాః**
**సాభర్తుః ప్రేయసీ నిత్యం రూపమాధుర్య పేశలా ॥**
**భర్తారం వశమానిన్యే రూపవశ్యాదికై తవైః**
**అస్యాం చాసక్త హృదయ స్సవిప్రో మోహ యంత్రితః॥**
**కదాచి దపినై వాగాత్ జ్యేష్ఠపత్నీం పతివ్రతాం ।**
**అనభ్యాగమనాద్భర్తు స్సా నారీపుత్ర వర్జితా॥**
**సదాశోకేన సంతప్తా కాలేన నిధనంగతా ।**
**అస్యాగృహ సమీపస్థోయః కశ్చిద్బ్రాహ్మణోయువా॥**
**ఇమాం వీక్ష్యాతి చార్వంగీం కామార్తః కరమగ్రహీత్।**
**అనయా రోష తామ్రాక్ష్యా సవిప్ర స్త్వవధీరిత॥**
**ఇమాంస్మరన్ దివానక్తం నిధనం ప్రత్యపద్యత ।**
**సైషా సమ్మోహ్య యత్కాంతం జ్యేష్ఠపత్నీ పరాఙ్ముఖం॥**
**చకారతేన పాపేన భవేస్మిన్ విధవా భవత్ ।**
**యాఃకుర్వంతి స్త్రియో లోకేజాయాసత్యోస్తు విప్రియం॥**
**తాసాం కౌమార వైధవ్య మేకవింశతి జన్మసుః**
**యదే తయా పూర్వభవే మత్పూజా మహతీకృతాః॥**
**తేనపుణ్యేన తత్పాపం నష్టమం త్రైవ జన్మనిః**
**ఏనాం స్మృత్వైవ యోవిప్రో మృతః కామ విమోహితః**
**సోస్యాః పాణిగ్రహం కృత్యా భవేస్మి న్నిధనం గతః।**

తా. ఈ ప్రకారమై నైధృవుని ప్రార్థనను దేవి యాలకించి ఓ మునివర్యా! యీ బాల పూర్వజన్మయందు ద్రవిడుండను బ్రాహ్మణునికి ద్వితీయ భార్య. అపుడీమె పేరు భామిని. రూపసౌందర్యములతో చాలా మృదువైనది.

తన సౌందర్యము చేతనున్నూ, వశీకరణాది క్రియలచేతనున్నూ భర్తను వశపరచుకున్నది. భర్తయున్నూ దీని మోహజాలమందుబడి దీనినే ప్రేమించుచే పతివ్రతయైన జ్యేష్ఠ భార్యవద్దకు యెప్పుడునూ వెళ్ళియుండలేదు. జ్యేష్ఠ భార్య భర్త రానందువలన సంతానహీనురాలై యెప్పుడు దుఃఖమందే మునుగుచూ కాలవశముచే మరణించినది. ఈ ద్వితీయభార్యయైన భామిని యొక్క గృహ సమీపమందున్న బ్రాహ్మణయువకుడీ సుందరాంగిని ప్రేమించి చెయ్యిపట్టుకొనగా రోషము చెంది ధిక్కరించగా నా బ్రాహ్మణుండీమెను స్మరించుచు మన్మదావస్థల ననుభవించి మరణించెను. ఈ భామినియు భర్తను మోహపుచ్చి జ్యేష్ఠ భార్యను జూడనివ్వనందున నీ జన్మయందు బాల వైధవ్యమునొందెను. లోకమందే స్త్రీయైనను దంపతుల కెడబాటు కలిగించిన యెడల ఇరువది యొక్క జన్మలవరకు బాల వైధవ్య మనుభవించవలసినదిగా మనుధర్మ శాస్త్రమందు గలదు. వెనుకటి జన్మయందు చేసిన పాపమంతయు నిప్పుడు ఉమా మహేశ్వర వ్రతమందు నన్ను పూజించుటయే నశించిపోయినది. ఈమెను స్మరించుచు కామమోహితుడై యే బ్రాహ్మణుండు మరణించెనో అతడే ఈ కన్యను బెండ్లాడి మరణించెను. జన్మాంతరమందు వాడనుభవించిన దుఃఖము నీ జన్మయందు తాననుభవింపవలసి వచ్చె.

**ప్రాగ్జన్మ పతిరేతస్యాః పాండ్య రాష్ట్రేషు సోధునా॥**
**జాతో విప్రతరశ్శ్రీమాన్ కృతదార పరిగ్రహః**
**తేనభర్త్రా ప్రతినిశం సైషాప్రేమ్ణాభి సంగతా॥**
**స్వప్నే రతిసుఖం యత్తు శ్రేష్ఠం జాగరణదాపి ।**
**షష్ట్యుత్తర త్రిశతయోజనదూరసంస్థా ।**
**దేశాదితో ద్విజ పరస్సచకర్మగత్యా।**
**ఏనాం వధూం ప్రతినిశం మనసోభిరామాం స్వప్నేషు।**
**పశ్యతిచిరం రతి మా దధానః॥**
**ఏషావై స్వప్న సంగత్యా పత్యుః ప్రతినిశం సతీ ।**
**కాలేన ప్రాప్యతే పుత్రం వేదవేదాంగ పారగః॥**
**ఏతస్యాం తనయంజాత మాత్మన నిశ్చితసంగమాత్ ।**
**సాపి విప్రోనిశి స్వప్నే ప్రేక్షతే ప్రేమభావితః॥**
**అనయా రాధితాపూర్వ భవేసాహం మహామునే।**



**అస్యై వరదానాయ ప్రాదుర్భూతా స్మితాంప్రతం॥**
**అథోవాచ మహాదేవీ తాం వధూం ప్రతిసాదరం**
**అయివత్సే మహాభాగే శృణుమే పరమంవచః॥**
**యదాకదా చిద్భర్తారం క్వాపిదేశే పురాతనం।**
**ద్రక్ష్యసే స్వప్నదృష్టం ప్రాక్జ్ఞాస్య సిత్వం విచక్షణా॥**
**ద్రక్ష్యతిక్వాం సవిప్రోపి సుచిరం స్వప్న లక్షితాం ।**
**తదాపరస్పరా లాపోయువయోస్సంభవిష్యతి॥**
**తదాస్వతనయం భద్రే తస్మై దేహి బహుశృతం ।**
**ఫలమస్య వ్రతస్యార్థం స్వ భర్తైత్వం సమర్పయ॥**

తా. ఆ మరణించిన బ్రాహ్మణుడే ఈమెను పెండ్లాడి మరణించెను. ఇతడు జన్మాంతరపతి. ఇప్పుడతను పాండ్యదేశమందు బ్రాహ్మణ శ్రేష్ఠుడై ధనవంతుడై వివాహము జేసికొని భార్యతో కాపురము జేయుచున్నాడు. ఈ శారద ప్రతిరాత్రి యందు స్వప్నములో ప్రేమతో నతనిని గలసి జాగ్రదవస్థ కంటెను నధికమైన సుఖముగల స్వప్న సంభోగము ననుభవించును. గాని జాగ్రత్ భోగ మీమెకెప్పుడును గలుగరాదని నాయాజ్ఞ. గాన ఇక్కడు రెండు వందల ఆమడల దూరమందున్న పాండ్యదేశమునుండి యా బ్రాహ్మణుండు కర్మానుభవము కొరకు స్వప్నములో వచ్చి యీ సుందరాంగిని ప్రేమించి సంభోగించుచు చిరకాలముండును. ఈ చిన్న దాన్ని ప్రతిరాత్రియు భర్తయొక్క స్వప్నభోగముచే కొంతకాలమునకు గర్భవతియై జాగ్రదవస్థలో నవమాసములు పూర్తియైన పిమ్మట నొక సుపుత్రుడుదయించి వేదవేదాంగ పారంగతుడగును. ఆ విప్రుడున్నూ తాను చాలా రోజులు నుంచి భోగించు స్త్రీయందు జనించిన పుత్రునిన్నీ స్వప్నమందు ప్రేమించుచుండును. ఓమునివర్యా! ఈ చిన్నది పూర్వజన్మయందునూ నన్నారాధించియున్నది. ఇప్పుడీమెకు వరమిచ్చుటకే నేను సాక్షాత్కరించితినని పలికి, ఓ చిన్నదానా శారదా! నీవు మహత్తుగల దానవై నామాట వినుము. యెప్పుడైనా నొకప్పుడు ఒకానొకచోట స్వప్నమందు వచ్చు భర్తను జాగ్రత్తయందు చూచి యానవాలు పట్టగలవు. అతనున్నూ స్వప్నమందు చూచు నిన్ను జాగ్రత్తయందు ఆనవాలు పట్టును. అప్పుడు మీకిద్దరు పగటియందు జాగ్రదవస్థలో సంభాషణ జరుగును. అప్పుడు కుమారుని యతనికందించి వీడు బహుశృతుడు నీకుమారుడేయని చెప్పి నీవు

చేసిన ఉమామహేశ్వర వ్రతమునందలి సగము ఫలమును భర్తకిచ్చివేయుము.

**తతః ప్రభృతి తస్యైవ వశీతిష్ఠ సుమధ్యమే।**
**యువయోరైహిక స్సంగోమాభూత్స్వప్న రతాదృతే ॥**
**కలాత్పంచత్వ మాపన్నే తస్మిన్ బ్రాహ్మణ సత్తమే ।**
**అగ్నిం ప్రవిశ్యతీ నైవసహయాస్యసి మత్పదం**
**పుత్రస్తే సహపాసుభ్రు స్సర్వలోక మనోహరః।**
**సంపదశ్చ భవిష్యంతి ప్రాప్యతే పరమం సుఖం ॥**

శ్రీసూతః–

**ఇత్యుక్త్యా త్రిజగన్మాతా దత్వా తస్యై మనోరథం**
**తయో స్సంపశ్యతే రేవక్షణేనా దర్శనం గతా ॥**
**సాపి బాలావరం లబ్ధ్వా పార్వత్యాః కరుణానిధేః।**
**అవాప పరమానందం పూజయా మాసతం గురుం ॥**
**తస్యాం రాత్ర్యాం వ్యతీ తాయాం సము నిర్లభలోచనః**
**తస్యాం పిత్రోశ్చ తత్సర్వం రహస్యా చష్ట ధర్మవిత్ ॥**
**అధ సర్వాను పా మంత్ర్య శారదాంచ యశస్వినీం ।**
**విధాయానుగ్రహం తేషాం యయౌస్వైర గతిర్మునిః॥**
**ఏవం దినేషు గచ్ఛత్సు సాపి బాలాప్రతిక్షపం ।**
**భర్తు స్సమాగమం లేభే స్వప్నే సుఖ వివర్ధనం ॥**
**గౌరిపర ప్రదానేన శారదా విశద ప్రభా ।**
**దధార గర్భం స్వప్నేపి భర్తు స్సంగాను భావతః॥**
**తాం దృష్ట్వా భర్తృ రహితం శారదాం గర్భిణీం సతీం ।**
**సర్వేధిగ్గిగితి ప్రోచుర్జారిణీతి జగుర్జనాః॥**
**తత్ సర్పదష్టస్య తద్భర్తుర్యే జ్ఞాతి కుల బాంధవాః।**
**తాం వార్తాం దుస్సవాం శ్రుత్వా యయుస్తత్పితృమందిరమ్॥**
**అధస్సర్వే సమాయాతా గ్రామవృద్ధాశ్చ పండితాః**
**అంతర్వత్నీం సమహూయ శారదాం వినతాననాం ॥**

తా. సన్నని నడుముగల శారదా! అది మొదలుకొని అతనియాధీన మందే యుండుము. మీ దంపతులకు స్వప్న సంగతియే గాని ఐహిక భోగ మెప్పుడును లేదు. ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు కాలమరణమును బొందినప్పుడు



నీవు సహగమనం చేసి నా పరమపదమును బొందగలవు. ఓ మంచి కనుబొమలు గలదానా ! నీ కుమారుడు అందరికంటెను సౌందర్యము గలవాడై కళత్ర పుత్ర ధనాదులతో గూడి మహాభోగము ననుభవించును. త్రిజగన్మాతయైన పార్వతి ఈ ప్రకారము వరములిచ్చి శారదా మునులు చూచుచుండగనే అంతర్ధానమాయెను. శారదయు కరుణానిధియగు పార్వతి వలన వరములు పొంది పరమానందముతో గురుని బూజించునంతలో తెల్లవారినది. మునియు నేత్రములు వచ్చినవాడు గాన కన్యక యొక్క మాతాపితరులను పిలచి రహస్యమందు రాత్రి జరిగిన వృత్తాంతమంతయు రహస్యముగా జెప్పి ఇది ధర్మమే యనెను. అందరిని ఆశీర్వదించి కన్యను కీర్తివంతురాలనుగా దీవించి అందరికీ ఉపదేశములుజేసి స్వేచ్ఛగా, నిస్సహాయముగా వెళ్ళిపోయెను.

తర్వాత కొన్ని రోజులు గడచిన పిమ్మట శారదాకన్య ప్రతి రాత్రియందును విశేష సుఖముగల భర్తృ సంగతిని పొందుచు, పార్వతీవర ప్రభావముచే స్వచ్ఛమైన కాంతిగలిగి భర్తృసాంగత్యము స్వప్నమందైనప్పటికి గర్భమును ధరించి మాసములు మోయుచుండగా ఇతర జనులందరు శారదను గర్భవతిగా జూచి భర్తలేనిదే గర్భవతియయ్యెనని, ఛీఛీ జారిణియయ్యెనని పలికిరి. సర్పదష్టమై మృతినొందిన పతియొక్క సోదరులు, బంధువులు వినరాని మాటను విని దాని తండ్రి గృహమును వచ్చిరి. గ్రామవృద్ధులు, పౌరులు, పండితులు మొదలగువారందరును వచ్చి సభజేసి–

**అంతర్జయన్ సుసంకృద్ధాః కేచిదానన్ పరాఙ్ముఖాః॥**
**అయి జారిణి దుర్బుద్ధే కిమేత్తేవి చేష్టితం ।**
**అస్మత్కులస్య దుష్కీర్తిం కృతవత్యసి బాలికే ॥**
**ఇతి సంతర్జయం తస్తే గ్రామ్య వృద్ధా మనీషిణః**
**సర్వేసంమంత్రయామాసుః కింకుర్మ ఇతిభాషిణః॥**
**తత్రోచుః కేచనా కృద్ధా త్తాంబాలాం ప్రతినిర్దియుః**
**ఏషాం పాపమతిర్బాలా కులద్వయ వినాశినీ ॥**
**కృత్వాస్యాః కేశవపనం ఛిత్వా కర్ణౌచ నాశికాం ।**
**నివార్యతాం బహిర్గ్రామా త్పరిత్యజ్య స్వగోత్రతః॥**
**ఇతి సర్వే సమాలోచ్యతాం తధాకర్తు ముద్యతాః।**

**అధాంతరిక్ష సంభూతా శుశ్రువేవాగ గోచరా॥**
**అనయానకృతం  పాపం నకృతం కులదూషణం ।**
**వ్రతభంగో నాస్తి తస్యా స్సచ్చరిత్రేయమంగనా॥**
**ఇతఃపరమియం నారీ జారిణీతి వదంతియే ।**
**తేషాం తోక్షనిమూఢానాం దీర్ఘోజిహ్వా వినర్యతే॥**
**ఇత్యంతరిక్షే జనితాం వాణీం శ్రుత్వా శరీరిణీం ।**
**సర్వే ప్రహృష్టా స్తత్రాసన్ జననీ జనకాదయః॥**
**తతస్సస్సంభ్రమం సర్వే గ్రామవృద్ధా స్స భాజనాః।**
**భీతాస్యా మౌన మాలంబ్య భీతాస్తస్థు రధోముఖాః॥**

తా. గర్భవతియై వినయముతో గూడిన శారదను పిలచి అతి కోపముతో భయపెట్టిరి. కొంతమంది నీ ముఖము చూడరాదని వెనుకకు తిరిగిరి. దుర్బుద్ధిగల ఓ జారిణీ! ఇంత పాడుపని చేసితివేమి ! మా కులమును అపకీర్తిని చేసితివిగదా పిల్లదానా ! అని గ్రామవృద్ధులందరు నిన్ను శిక్షిస్తామని పలికి అందరు ఇప్పుడు చేయవలసిన కర్తవ్యము నాలోచించుచుండిరి. అందులో కొందరు అహంకారముతో పాపబుద్ధితో కులధర్మమును పాడుచేసినది. అందుకుగాను కేశములను వపనం జేయించి, ముక్కులను చెవులను గోసి గ్రామమునుండి వెడలగొట్టి ఘటశ్రాద్ధమును జేసి వెయ్యవలెనని శిక్షించిరి. అందరు అందుకు సమ్మతించి, చేయనుద్యుక్తులై యుండగా, అంతరిక్ష వాక్కులిట్లు వినబడినవి. "ఈ చిన్నదేమియు పాపమును జేయలేదు. కులమును పాడుచెయ్యలేదు. వ్రతభంగము గాలేదు. ఈ చిన్నది సుశీలయే! ఇటుపైన ఈ స్త్రీని జారణియని యెవరందురో వాళ్లు మహాపాపులు వాళ్ళ జిహ్వ బ్రద్ధలైపోవును" ఇట్లు పలికిన యశరీర వాక్కును విని తల్లిదండ్రాదులు సంతోషించిరి. గ్రామవృద్ధులు సభవారునూ సంభ్రమముతో గూడి మౌనముతో మాట్లాడక తలవంచుకొనిరి.

**తత్రకేచి దవిశ్వాసా మిథ్యావాణీత్యవాదిషుః।**
**తేషాం జిహ్వాద్విధాభిన్నా వముముస్తే క్రిమీన్ క్షణాత్॥**
**తతస్సంపూజ యామాసుస్తాం బాలాం జ్ఞాతి బాంధవాః।**
**బంధుస్త్రియశ్చ వృద్ధాశ్చ శశం సుస్సాధుసాధ్వితి॥**
**ముముచుః కౌచిదానందా న్బాష్ప బిందూన్ కులోత్తమాః।**



**కులస్త్రియః ప్రముదితాస్తామా శ్వాస్య స మాశ్లిషన్ ॥**
**తదాతత్రా పరే ప్రోచుర్దైవం వదతి నానృతం ।**
**కథమేషా దధౌగర్భం శీలాన్నస్ఖలితా యది ॥**
**ఇతి సర్వాన్ సభ్యజనాన్ సంశయావిష్ట చేతసః।**
**విలోక్య వృద్ధ స్త త్రైకో బభాషే లోక తత్వవిత్ ॥**
**మాయా మయమిదం విశ్వం దృశ్యతే శ్రూయతే చయత్ ।**
**కింభావ్యం కిమభావ్యం వా సంసారేస్మిన్ భ్రమాత్మకే ॥**
**అనిరూప్య మభూతార్థం మాయయా జయతి స్ఫుటం ।**
**ఈశ్వరస్యచ యన్మాయా తస్యాః కోవేద చేష్టితం ॥**
**యువకేతోస్తు రాజర్షే శ్శుక్లం నిపతితం జలే ।**
**సశుక్లం తజ్జలం పీత్వా వేశ్యాగర్భం దదౌకిల ॥**
**మునేర్విభాండ కన్యాపి శుక్లం పీత్వా సహాంభసా ।**
**హరిణీ గర్భిణీ భూత్వా ఋష్యశృంగమసూయత॥**
**సురాష్ట్రస్యత ధారాజ్ఞః కరంస్పృష్ట్వా సురాంగనా ।**
**తత్ క్షణా ద్గర్భిణీ భూత్వా మనుం ప్రాసూత తాపసం॥**
**తథా సత్యవతీ నారీశబరీ గర్భ సంభవా ।**
**తథైవ మహిషీ గర్భే జాతోహి మహిషాసురః॥**

తా. అందులో కొంతమంది ఈ అంతరిక్ష వాక్యముల సత్యములు మేము విశ్వసించమని పలికినంతలో వారి జిహ్వ బ్రద్దలై నోటివెంట క్రిములు వాంతులైనవి. పిమ్మట జ్ఞాతులు, బంధువులు, ఆ బాలను పూజించి యపరాధ మనిరి. వృద్ధురాండ్రైన బంధు స్త్రీలందరు నీ శీలము చాలా బాగుగానున్నదని పలికిరి. కులపెద్దలు కొందరానంద బాష్పములను విడిచిరి. కుల స్త్రీలామెను ఓదార్చి ఆలింగనము జేసికొనిరి. అప్పుడు మరికొందరు దైవము (అశరీరి) జెప్పినదసత్యము గాదనిరి. శీలము జెడకపోతే గర్భమెట్లు వచ్చినదని మరి కొందరనిరి. ఇట్లందరి యొక్క సంశయవాక్కులను విని లోకతత్వము నెరింగిన నొక వృద్ధుడిట్లు జెప్పుచున్నాడు.

"ఈకనబడే వినబడే ప్రపంచమంతయు మాయామయము (లేనిదే) భ్రమరూపమైన సంసారమందు ఉన్నదేది ? లేనిదేది ? మునుపులేనిది ఇప్పు డున్నదని జెప్పవీలులేని ప్రపంచమును మాయయే జయించుచున్నది. ఈ

